# ప్రేమించేను

△

విద్వాన్ విశ్వం

▽

ఆదర్శ గ్రంథమండలి,
విజయవాడ.

# ప్రేమించేను

## 1

నేనామెను ప్రేమించాను.

ఆమె అందాన్ని చూచి కాదు. ఆమె ఆర్ద్రహృదయం చూచి కాదు.

ఆమెను చూచాను.

ఆమెతో మాట్లాడాను.

ఆమెకోసం నిరీక్షించాను.

ఆమె స్నేహాన్ని కోరగోన్నాను.

అనుకోకనే ఆమెను ప్రేమించాను.

ఆమెకన్న రూపవతులూ గుణవతులూ ఉన్నారు. నే నెఱుగుదును; కాని వారిని ప్రేమించలేదు.

అంతకన్న విద్యావతులూ, సునిశితబుద్ధులూ నా పరిచితులలో ఉన్నారు. కాని వారిని నేను ప్రేమించలేదు.

ఆమెలో ఏ ఒక్క విశిష్టతా కొట్టవచ్చేట్టు కన్పించదు. ఆమె మాటలు కవిత్వంలా మనసును కలతపెట్టవు. ఆమె చేసిన ఏ కార్యమూ చరిత్రలో కెక్కవలసినదేమీ కాదు.

ఆమె గొప్ప కావ్యాలు రాయలేదు. గొప్ప చిత్రాలు చిత్రించలేదు. గొప్ప నటీమణి కానేకాదు. కనీసం పాటకూడ పాడలేదు.

ఆమె చాల మంచిమనిషి.

ఆమె చాలా గొప్పమనిషి.

అంతే...

ఆ మంచితనమేదో, ఆ గొప్పదన మెలాంటిదో నేను నిర్వచించలేనుగూడ. కాని ఆమె మంచిదనీ గొప్పదనీ నాకు బాగా తెలుసు.

ఆమె నో ఆరాధ్య మహాదాశయంలా ప్రేమించాను. ఆమెకోసం ఆవేదన చెందాను. ఆ ఆవేదనలో నా పను లెన్నిటినో కట్టిపెట్టాను. అహోరాత్రులూ అదేధ్యానంలో నిమగ్నుడ నయ్యాను.

ఆమె మాత్రం నన్ను ప్రేమించలేదు. ఏ ఆశనూ రేకెత్తించలేదు. ఏవిధంగానూ నన్ను సంతోషపెట్టాలన్న ఆతురత చూపలేదు. అలా కనిపించేందుకుకూడ ప్రయత్నించలేదు.

కించపడుతూనే 'ని న్నేవిధంగానూ సుఖపెట్టలేను'. అని చెప్పివేసిందికూడ. ఆ మాట లంటున్నప్పు డెంత బాధపడుతున్నదో, ఎంత బరువుతో ఆ మాటలు బయటపడుతున్నవో అతి స్పష్టంగా చూచాను. ఆమాటల్లో కవిత్వం లేదు. దాపరికం లేదు. అంతగా నా హృదయాన్ని కదిపివేసిన మాట మరొకటి నేను వినలేదు.

ఆమె ఏదో అస్పష్ట వ్యథతో బాధపడుతున్నదని ఏ రోజో ఇలా చెప్పితీరుతుందని అనుమానిస్తూనే వచ్చాను.

అప్పుడని ఆమెను ప్రేమించకుండా ఉండలేక పోయ్యాను. భగ్నప్రేమికుడనని శోకాలుబాదడంకోసం కాదు. ఆ

మధురబాధలో ఉన్న ఆనందాన్ని అనుభవించాలనీ కాదు. సగో మారకపోతుందా అన్న ఆశతోనూ కాదు మరి!

ఇంకోవిధంగా ప్రవర్తించడం సాధ్యంకాలేదు, కాబట్టి ఆమెను ప్రేమించాను.

అంత ఉదాత్తత, సంస్కారం, సౌమనస్యం ఉన్నత కుటుంబాలకు చెందిన నవనాగరిక నవలాలోకంలో నే నెప్పుడూ చూడలేదు.

అంత సహజప్రవర్తన నే నెఱుగను. నటనకూ నాగరిక వనితకూ ఏది దేనికి పర్యాయపదమో సామాన్యంగా చెప్పలేము.

ఆమె సహజ స్వాతంత్ర్యప్రవర్తనను నే నెన్నడూ అపార్థం చేసుకోలేదుకూడ. నా మన్మథ సౌందర్యం చూచో, నా బుద్ధి నైశిత్యం చూచో, నా వాక్చాతుర్యం చూచో ముగ్ధురాలై నాపైపడుతుందనుకొనేంత పసితనం కాదు నాది.

ఏమాత్రం సరాగంకాని, సకామంకాని కాని సహజ స్నేహంతో మాత్రమే ఆమె నన్ను చూస్తున్నదని, అందుకు తగిన శక్తి ఆమెకున్నదని నాకు తెలుసును. అంత గుండెబలమున్న మనిషి కాబట్టే అంతగా నెనరుచూపాను. కళ్ళలోకి చూస్తూ. తెప్పలువాల్చివేయకుండా ఎలాంటివిషయంపైనైనా చర్చించగల మనిషి ఆమె.

ఈచనువును అవకాశంగా తీసుకొని, ఆమెను అనుభవించాలన్న తలంపు నా కేకోశానా లేదు. అలా నన్ను, ఆమెను కూడ తేలికపరుచుకునే నైచ్యానికి నే నెన్నడూ పాల్పడలేదు.

కాని ఆమెను ప్రేమించాను.

ఆమెవద్ద ఈ అంశం దాచలేకనూపోయ్యాను.

అంతమాత్రంతో ఉక్కిరి బిక్కిరై పోయి ఆమె ముఖం తప్పించనూ లేదు. కొంప లంటుకున్నట్టు గుండెలు బాదుకోనూ లేదు.

అతి సహజంగా, అతి విచారంగా క్షమించమన్నట్టు చూచింది.

ఆమెతిరస్కారంతో నా కామెప్పై కోపమూరా లేదు. విసుగూ కలగ లేదు. ఆమె నన్ను శేలికగానూ చూడ లేదు. తప్పించుకొని పారిపోనూ లేదు.

మాలో ఒకరిపై నొకరికున్న గౌరవాదరాలు అవగింజ వాసికూడ తగ్గ లేదు.

కాని ఏదో ఒక కంచుగోడ, మాయిరువురి హృదయాల నడుమా ఆకాశమెత్తున లేచి నిల్చున్నదని, అప్పుడే ఇద్దరమూ గ్రహించాము. ఇది మమ్ములను వేఱుపఱచ లేదు. ప్రేమికులనుగా మాత్రమే అది వేఱుచేయగల్గినది. ఇదికూడ తాత్కాలికమో శాశ్వతమో చెప్ప లేను. ఏనాడో ఆ కంచుగోడ ఉల్లిపొరలా తేలిపోవచ్చును, చైనాగోడలా నిలిచిపోవచ్చును.

ఎప్పటి మాటో ఎందుకు? ఇప్పటికే మ్యాటకు నాలో భరించ లేని ఒక యాతన భగ్గుమని మండుకొన్నది. ఆ మంటల నార్పగల మనిషి ఆమె ఒక్కతే. నా క్షా శక్తి ఇక లేదు.

ఈ గుండెబరువును మోయ లేకే మీముందు నా సమగ్రకథనం వినిపించాలని కూచున్నాను. రచనా పాటవమో,

రసనా నైదగ్ధ్యమో వెలువరించే ప్రయత్న మిందులో ఇసుమం తయినా లేదు. నా హృదయకుహరంలోని చీకటిమూలల్లో తల విరియబోసుకుని నాట్యంచేస్తున్న విషాద పిశాచిని మీకు చూపించడంకోసమే ఈ శ్రమ.

అందుతోపాటు నా ఆత్మవిమర్శనంకూడ కొంత జరిగి తీరుతుంది కదా! తద్వారా నా ఆవేదనలోని అంతరాంతరాలలో ఏవిధమైన కాలుష్యమున్నా కనిపించవచ్చు. అప్పుడు దానిని క్షాళితం చేసుకోగలుగుతానేమోననికూడ ఆశ.

# 2

ఆకస్మికంగా మేము కలుసుకున్నాము. ఒకచోటనే మేము పదేపదే కలుసుకోవలసివచ్చేది.

ఆమెను ప్రత్యేకించి చూడకుండానే కొన్ని నెలలు గడిపాను. ఆమె అస్తిత్వాన్నే నేను గుర్తించలేదు. ఆడవాళ్ళను గుర్తించే అలవాటు తప్పిపోయి అప్పటికే చాలకాలమయింది. అందులో ధనిక కుటుంబాలకు చెందిననూ స్త్రీలంటే నా కసలు బహుమతి లేదు.

స్త్రీలంటే కేవలం యంత్రాలని కాని, అధములనికాని, వంచకులనికాని, చాందసంగా భావించేవాడినికాను. కాని ఈ ఉన్నతవర్గీయుల మనుకునే స్త్రీలప్రవర్తనలోవున్న కృత్రిమత చూచిచూచి విసిగి ఒక విధమైన వుపేక్షా, ఔదాసీన్యమూ నాలో నేసుకొన్నవి.

కార్మికులలోనూ, పేదరైతులలోను స్త్రీ మగవానికి సహచారిణి. వారంటే నా కెంతో గౌరవ ప్రతిపత్తులున్నవి. వారు బొమ్మలుకారు, మనుషులు

అలాగే దేశంకోసం, ప్రజలకోసం. ఒక వున్నతాశయంకోసం పనిచేసిన - చేస్తున్న మహాశిలపై నాకు బహుమానాదరాలున్నవి. కాని ఈ పనులేవో విలాసంగా గాక జీవిత పరమాశయంగా వుండాలన్నదే నా ఆశ.

మరి జన్మతఃమాత్రమే వున్నత కుటుంబాలకు చెంది, సీతాకోకచిలుకల్లా సింగారించుకోడమే, విలాసాలతో, వినోదాలతో కాలక్షేపంచెయ్యడమే, తమ చాతురితో మగపురుగుల మనసులకు గిలిగింతలు పెట్టడమే జీవితావధిగా భావించుకునేవాళ్ళంటే నాకు అసహ్యం.

ఈ జాతిలో చదువుకుంటారు - డబ్బున్నది కాబట్టి. లేదా చదివింపబడతారు. పనీపాటా లేదు కాబట్టి మరికొన్ని నాటకాలో, నవలలోకూడ చదువుతారు. బొమ్మల పత్రికలు చూస్తారు.

అభిరుచివున్నా లేకపోయినా నాటకాలకూ, నాట్యాలకూ, పాటకచ్చేరీలకు వెడతారు. విధిగా కొంత బలవంతపు సంగీతం కూడ నేర్చుకోవచ్చు. కులాసాగా పదిమంది మిత్రులతో కాలం గడిపేందుకు సినీమాలకు పోతారు.

వీ టన్నిటిమూలంగా పదిమంది డైరెక్టర్లూ, గాయకులూ, పదిమంది నటులూ, కొద్దిమందికి పదిమంది రచయితలూ, కవులూ కనీసం పేరుతోనైనా పరిచితులయివుంటారు.

ఆస్కారున్నైట్లు అన్నట్టు కళలపైకాదు కళాకారులపైనే వీరి కభిమానం.

సహజంగా ధనానికున్న పలుకుబడికొద్దీ కొంత నాగరిక తాచ్ఛాయ వీరిపై పడితీరుతుంది. విందులలో వినోదాలలో పదిమందితో పిచ్చాపాటీ మాట్లాడాలి కాబట్టి కొన్ని మర్యాదలూ, అలవాట్లూ పట్టుపడుతాయి. తియ్యగా నవ్వడం, శ్రావ్యంగా మాట్లాడ్డం, కమ్మగా పలుకరించడం, ఆదరం వుట్టి పడుతున్నట్టు కళ్ళు విప్పడం నేర్చుకుంటారు. కొందరికి బుద్ధి పూర్వకంగాను, కొందరికి పరిస్థితుల ప్రాబల్యంవల్లనూ ఇవి అలవడుతవి. కాని వీని లోతుల్లో ఏదో కృత్రిమత, శుష్కత్వం తొంగిచూస్తూనే వుంటుంది.

వీరి సంస్కారం గొంతు దిగి వెళ్ళదు. వీరి తల త్వర త్వరగా పనిచెయ్యదు. వీరి గుండె పటపటా కొట్టుకోదు. తల పగులగొట్టుకొనే సమస్యలు వీరి కుండవు. గుండె చీల్చే ఆవేదనలు వీరిజోలికి పోవు. లేదా వీరు వానిజోలికి పోరు.

ఏ తోడి వనిత ఏటుపోటు మాటలకో, ఏ సాటి అమ్మాయి విలాసవిచ్ఛిత్తిని చూచో, ఏ విందులోని మిత్రుల వుపేక్షాభావాన్ని చూచో మనసు చెడి విషాదాక్రాంతలు కావచ్చు. అసలు గుండెలు కుళ్ళిపోజేసే నిజమైన జీవిత సమస్యలు వీరు గుర్తించరు. సుఖాపేక్ష తీరితే ఎలాంటి భావ భ్రమణాన్నైనా వీరు సరిపెట్టుకోగలరు.

ప్రేమ భంగాలలాంటివి, ప్రియవియుక్తులలాంటివి, ఈ జాతిలోనే కనిపించవని నే ననను. అవి ప్రేమభంగాలుగా కాక

చెడిన బేరాలుగామాత్రమే వీరు చూస్తా రంటాను. వీరి అభిమానం దెబ్బతింటుందికాని, వీరి గుండెలో కుంపటిరగులుకోదు. రగిలినా త్వరగా చల్లబడిపోరుకుంటుంది.

వుదయమే కాలకృత్యాలు నిర్వర్తించుకొని, వుపహారానంతరం మెత్తని పరుపున పడుకొని గబాలున వెక్కి వెక్కి ఒక వియుక్తాంగన విలపించవచ్చును. కాని అప్పుడుకూడ ఎవరు చూచిపోతారో అన్న ఆందోళన, చీర మడతలు చెడుతాయేమోనన్న కలవరపాటు వారిలో మేలుకొనే వుంటుంది. కన్నీళ్ళతో వారి వేదన కారిపోతుంది. వెంటనే వచ్చిన మరొక మిత్రునితోనో. మిత్రురాలితోనో అతి సహజంగా వీరు సరసాలాడగలరు. వారివెంట ఏ విలాస ప్రదర్శనకో వెళ్ళగలరు. ఆనందించగలరు కూడ.

తమపై ప్రేమతో ఏ యువకుడో పడిచావడం చూచి వీరు గర్విస్తారు. కాని ఎవరికోసమూ తాము చచ్చేందుకు ఒప్పుకోరు.

రెండుచేతులా జీవితంలోని చేవగల ఆనందాన్నీ అనుభవించ లేరు. ముష్టివేదనూ మూర్కొన లేరు. లోతుల్లోకి చూస్తే వీరికి కళ్ళు తిరుగుతాయి. వున్నత పథాలలోకి ఎగిరితే వీరికి ఊపిరాడదు.

జీవిత చక్రాన్ని వీరు నడపరు. జీవితం నడుస్తుంటే వీరు దాన్నిపై కదలక మెదలక కళ్ళు మిటకరిస్తూ కూచొని తాము నడుస్తున్నా మనుకుంటారు.

ఇలాంటి వర్గానికే చెందిన ఈమెనుకూడ నేను నిదే

భావంతోనే చూచివుంటాను ఉపేక్షతో కనులు మరల్చుకుని వుంటాను. కాబట్టే ఒక్కసారి పలుకరించినపాపాన పోలేదు. నన్ను పలకరించవలసిన అగత్యం ఆమె కసలే లేదు.

ఆమె నన్నొక అమాయకుడుగానో, అనాగరికుడుగానో, చాందసుడుగనో భావించివుంటుందేమో నాకు తెలీదు

అప్పటికి యింతే.

యిలా కొన్ని నెలలు గడిచాయి.

ఆమె కనబడుతూనే వున్నది. ఇతరమిత్రులతో పాటు మాట్లాడుతూనే వున్నది. అడపా దడపా ఆమె నిర్మల మందహాసాన్నో, కలస్వనాన్నో వింటూనే వున్నాను. కాని, ముఖాముఖీ సంభాషణకాని, కనీసం చూచుకోవడం కాని లేకుండా కాలంగడిచింది. ఏమైనప్పటికీ ఆమె అంత తేలికైన మనిషికాదని మాత్రం నాలో లోపల ఏదో ఒక భావ చ్ఛాయ నాకు తెలీకనే పాదుకొన్నదేమో చెప్పలేను.

# 3

"ఎంత గొప్ప వుపన్యాసం"

"ఆయనన్న ప్రతిఒక్కమాటా నిజం."

అప్పుడప్పుడే వినివచ్చిన ఒక వేదాంతోపన్యాసాన్ని గూర్చి చర్చిస్తున్నారు. — ఆమే, ఆమె మిత్రులూ.

"జీవితంలో మనం చేయగలదేమీ లేదు. నిర్వికారులమై, నిర్మమత్వంతో సాక్షిభూతులుగా వుంటమే మన కర్తవ్యం" అన్నారొకరు.

"అలా అయితే మనం చేయవలసినదేమిటి? ప్రపంచం నాశనమైపోతున్నా చూస్తూ కూచునేందుకు మనం వేదాంతులం కానక్కరలేదు. భయంతోనూ, సుఖాపేక్షతోనూ మనం చేస్తున్న పనే అది." అన్నదామె.

ఈ గుంపులో ఆమాత్రం మాటలన్నవారెవరా అని తలయెత్తి చూచాను. అప్పుడే ఆమె ముఖం స్పష్టంగా మొట్టమొదటిసారి చూచాను. చాల ప్రసన్నంగా, నిష్కల్మషంగా కనిపించింది.

చక్కని ముక్కూ, సోగ కళ్ళూ, నవ్వులొలికే పెదవులూ, తీర్చి దిద్దినట్టున్న గొంతుకా, విశాలమైన నుదురూ.

"మీ అభిప్రాయమేమిటి?" అన్నట్టు నా కళ్ళలోకి చూచింది - తొలిసారిగా.

నాకిలాంటి చర్చలలో పాల్గొనే అలవాటు లేదు. సుఖజీవనుల శుష్కచర్చ లెందుకూ పనికిరావని ఎన్నడో తెల్సుకున్నాను. అయినప్పటికి ఆమెతో ఏకీభవిస్తున్నట్టు తల పంకించాను. పొడిమాటలతో-వుపేక్షా ఔదాసీన్యాలు, ప్రపంచం తమవరకు బాగున్నదనుకొన్నవారిలో మాత్రమే కనిపిస్తాయని, నిజంగా లోకం పట్టాలు తప్పి నడుస్తున్నదని గ్రహించిన ప్రతి మనిషీ దానిని దిద్దే బాధ్యత తనకుకూడ కొంత కలదని గ్రహించుతాడని చెప్పాను. నిరపేక్ష, నిర్మమత్వం పరబాధాసహనానికి కాక, తన సుఖలాలసతను దెబ్బకొట్టేందుకు మాత్రమే వుపయోగించాలని అన్నాను-మిగతవారివేపు తిరిగి.

అదే మా మొట్టమొదటి సంభాషణ.

ఆ క్షణంలోనే మా యిద్దరిలోనూ ఒకరి పై నొకరికి ఒక విధమైన బహుమానం, ఆదరం యేర్పడినవి. అవి నేటిదాక చెక్కు చెదర లేదు.

తత్వశాస్త్రం జీవితంలో అవసరమైన భాగం కాదు; నానా కశ్మలాలతో బతుకుతూన్నవారు, ఒక పూట విన్నంత మాత్రంతో పాపప్రక్షాళనం చేయగల సాధనం అని భావించే అంధవిశ్వాసాన్నికూడనూ ఎదుర్కోవడం మంచిదన్న భావం నా కేర్పడింది. ఆ చర్చ ఆ రోజుతో ఆగిపోక మరికొన్ని రోజులు సాగనివ్వవలసివచ్చింది.

ఇక తర్వాత జీవితమంటే ఏమిటి? ప్రపంచంలో ఈ దుఃఖ దారిద్ర్యాలకు వివిధ తాత్వికులు చూపే తరుణోపాయా లేమిటి? అనే అంశంపై ఆమెతో చర్చించసాగాను.

ఆమె అతి సుఖభూయిష్టమైన జీవనం తప్ప కష్టజీవుల బతుకుచెడు నేమాత్రం యెరుగదు. పేదతనాన్ని గూర్చి, బతుకు బరువునుగూర్చి ఆమె కేదైనా తెలిసివుంటే అది ఒక పుస్తకాల ద్వారా మాత్రమే.

పుస్తకాలద్వారా మనం క్షుణ్ణంగా జీవితాన్ని తెలుసుకో లేము. ఎంత గొప్పకవి వ్రాసిన జీవిత సమస్యనైనా మనం వింటున్నప్పుడో, చదువుతున్నప్పుడో బాగా బాధపడ్డం జరగవచ్చు. కాని దాని పదును మన కా సమస్యతో వున్న యదార్థ సంబంధాన్నిబట్టి ఎక్కువగా ఆధారపడివుంటుంది. అన్ని సమస్యలూ - అందరినీ కదపలేవు.

అట్లని పైవర్గాలవారు దరిద్రాన్ని, బాధామయ గాథలను భ్రాంతిగా అర్థం చేసుకోరని కాని, వానికి గురియయినవారిపై సానుభూతి చూపరని కాని నేననడం లేదు. కాని వారి జ్ఞానం కాని, అనుభూతి కాని గుండెలలో రక్తంలో ఒక భాగమైపోదు. ఒక సినిమాలో నాయకుడో నాయకురాలో మహాపదలో నున్నప్పుడు సామాజికులలో కొందరి కళ్ళు తడి కావచ్చు కాని, ఆ తడి మందమలయానిలస్పర్శకే ఎండిపోతుంది. తాము అందులో భాగకులు కామని, ఇదొక గాథ అని వారు స్పష్టంగా గుర్తించుతారు. కాబట్టి ఆ బాధా దర్శనంలో వారికొక విధమైన ఆనందం కలుగుతుంది. కాని కసి కలగదు.

నేటి దగ్ధజీవితాన్ని బాగుపరిచేందుకు పేదలపై బాధిత ప్రజాకోటిపై సానుభూతి సద్భావాలు చాలవు. ఈ పాడుబ్రతుకునకు కారణభూతులైన వారిపై పరిస్థితులపై తీవ్రవిద్వేషం, పచ్చికసి రోమకోమానికీ వ్యాపించాలి. దుర్భర పరిస్థితులపై తీవ్రమైన అసహ్యం నరనరాల్లోకి ప్రాకిపోవాలి. పైవర్గంపై అసూయ కాదు. ద్వేషం కలగాలి. తాను ఆ వర్గంలో ఒక భాగంగా వున్నప్పుడు, తాము అందుకు సిగ్గుపడిపోవాలి. ఆ కశ్మలంనుండి మానసికంగా విడిపోయేందుకు తీవ్ర కృషి చేయాలి. ఇది ఏ నూటికొక్కరికో తప్ప అలవికాని తలకుమించిన పని.

ఆమె సద్భావమో దయార్ద్రహృదయమో కూడ 'అయ్యో పాపం!' అన్నమాట కంటే కించిత్తుకూడ పైకిపోవునని కాదు. కాబట్టి ఈ శుష్క వేదాంత చర్చలు, మన ప్రతిభా

నైశిత్యాన్ని ప్రదర్శించడంకోసం తప్ప దమ్మిడీకి పనికిరానప్పుడు వాని జోలికి వెళ్ళడం వట్టి దండుగ అనిపించేది.

ఆ మాట నొకసారి స్పష్టంగా చెప్పివేశాను. ఆమె చాల బాధపడ్డది. అసలు సమస్యలేవో తెలియనప్పుడు, వానిని విడమరచుటకు ప్రయత్నిస్తామా లేదా అన్న భావంపై తాను చెప్పగలిగిన దేమీా లేదన్నది. తన కింతవరకు తెలిసిన భావ ప్రపంచం చాల సంకుచితమైనదని, అజ్ఞానంలో ఉన్న శుష్కానందం తప్ప తనకు మఱొకటి తెలియదని ఆమె నొచ్చుకున్నది. అంతమాత్రంతో తనకు జిజ్ఞాసే లేదనుకోవడం సరి కాదని, ఎంతో ఆతురతతో నూతన దృక్పథాలను నూతన భావాలను గ్రహించుకోవాలన్న ఆసక్తిని కనబరచినది.

లెనిన్ ఒకసారి అన్నాడు–*There is no thormometer for sincirity'* అని. అంతేకాక ఒకప్పుడు ప్రాథమిక దశలోని కేవల పరిజ్ఞానేచ్ఛ కూడ. తర్వాత కార్యప్రవణతాసాధనంగా మారడం కూడా నే నెరుగుదును.

ప్రజా సేవనాప్రపంచంలోని కనేక దారు లున్నవి. ఒకొకమా రొక మార్గంగుండా లోనికి ప్రవేశించుతారు.

ఏదో ఒక సంఘటనలోని దౌష్ట్యాన్ని చూసి ఓర్పుతో లేక రంగంలోకి దుమికి, తర్వాత అలాగే నిలబడిన వీరు లెందరో ఉన్నారు.

జ్ఞానేచ్ఛతో పుస్తకాలు చదివి, పాడు బతుకుపై రోసి ప్రజా సేవలోనికి దూరినవారున్నారు.

పరిస్థితుల ప్రతీకారపరత్వముతో బతుకు బద్ధులై, విరక్తితో లోకసేవకు పూనుకునేవారున్నారు.

ఇక డాబు, డంబం, నటనలకోసం వచ్చే వారూ కొల్లలుగా ఉండనే వున్నారు.

ఇలాంటప్పుడు ఒక మెత్తనిగుండె కనిపించినప్పుడు, సంధిలోని కుళ్లును చూపి కొంత ఆర్ద్రితచేయడంలో నష్టమేమున్న దనిపించడం పరిపాటి. ఆ దృష్టితోనే వివిధ సమస్యలపై ఆధునికుల దృక్పథమేమిటో చెబుతూవచ్చాను. మన మనస్సు, మన దృష్టి, మనప్రవర్తన ఎలా మన సంప్రదాయ సిద్ధనైతిక ధోరణులవల్ల ఏర్పడినవో ఎప్పటి కప్పుడు వివరిస్తూవచ్చాను.

నీతి, నియమం, మంచీ చెడ్డ వగైరా మాట లన్నిటిని మన మేమాత్రం ఏ చికిత్స లేకుండా ఎలా చిలుకలలా వల్లెవేస్తామో - ఆ మాట లన్నీ కాలపరిస్థితుల ప్రాబల్యం వల్ల ఎలా మారుతాయో గ్రహించినవారు చాల తక్కువ.

ఒక సునిర్దిష్టమైన తాత్త్వికదృక్పథం లేకుండా, జీవితంలో ఒక నిశ్చిత ప్రయోజనం లేకుండా, చావలేక బతకడం, బతకలేక చావడం చాలమంది చేస్తున్న పని.

'మనదీ ఒక బతుకేనా'

సందులలో పందులవలె'

అంటూ చెబుతున్నప్పు డామె ఏదో ఒక నూతన సత్యం కనబడుతూన్నట్టు విప్పారిన కళ్ళతో విస్తుపోయి చూచేది.

ఆమె పూర్తిగా ఇలాంటి నూతన దృక్పథానికి అపరిచితురాలు. కాని ఈ దుడుసూ దూకుడూ గల భావాల నెంతో

సౌమనస్యంతో వినగలుగుతున్నది. వాటిని అర్థంచేసుకునేందుకై ప్రయత్నిస్తున్నది. సుఖజీవనుల, పరాన్నభుక్కుల బ్రతుకుపై ఒకవిధమైన అసహ్యం కాకున్నా – ఏదో అసంతృప్తి ఆమెలో బయలుదేరుతున్నట్టు గుర్తించాను.

ఆ అసంతృప్తి నిరాశకు దారితీయునదికాక, మరింత తీవ్రభావంగా మారి కార్యప్రేరకమయ్యేట్టు చేయాలని కలలుగన్నాను.

ఆమెతో ఈ చర్చలు జరుపుతున్నప్పుడు నాలో ఏ విధమైన హృదయస్పందనంకాని కలుగలేదు. ఆమె నొక యువతినిగా కాక, మానవమాత్రురాలినిగా మాత్రమే చూస్తూ వచ్చాను. చెబుతున్న మాటలలోని అంతరాంతరాలలోని చూస్తున్నట్టుగా ఆమె ఎంతో అత్యాసక్తితో చెవుల నప్పగించి వింటుండేది. నేనేదో ప్రవాహధోరణిలో, అత్యావేశంతో చెప్పుకునిపోతూండేవాడిని. తుప్పుపట్టిన సంఘవ్యవస్థ నా యెదుట నాట్యం చేస్తుండేదే కాని, ఆమె ముఖభంగిమ నా కళ్ళకు కన్పించేదేకాదు.

ఇందులో ఏవిధమైన మమతకుకాని, చనువుకుగాని అవకాశమూలేదు, ఆస్కారమూలేదు.

ఏమైనా ఆమె నిల్చిన నీటిమడుగు జీవితంలో రాళ్ళు వేసి కదిపాను. అందులో చిలువలు పలవలుగా రేగుతున్న అలలను చూచాను. ఆ నీ రేదో శుభ్రమైన గాలికోసం, సంచలనంకోసం, కొత్త వాతావరణంకోసం ఎక్కడికో పారిపోవా లన్నట్టు అత్యాకులసంభరితమైనది.

# 4

ఈ చర్చల సందర్భంలోనే నే ననేక ప్రపంచ ప్రముఖ రచయితల రచనలలోనుంచి కొన్ని ఉదాహరణ లివ్వసాగాను. సామాన్యంగా ఏదో సిద్ధాంత ప్రవచనాలకన్న, జీవితంలోని లోతుల్లో ఈ సిద్ధాంతా లెలా పెనవేసుకొని విషం కక్కుతున్నవో చూపే సాహిత్యరచనలు కొత్తవారిలో ఆలోచనలు రేపుతాయి.

ఆసందర్భంలోనే ఆమె దాదాపు ఆంగ్ల సారస్వతంలోని ప్రముఖ రచనలను చాలావరకు చదివినదని తెలుసుకొన్నాను. కాని వానిని నవలలుగానో కథలుగానో తప్పితే, అవి జీవన ప్రతిబింబాలుగాగాని, జీవన మార్గదర్శనాలుగాగాని ఆమె యెన్నడూ చూడలేదు. అందులోనూ మానసిక పరిణామాదులను వివరించే రచనలుగాక, సంఘటన లెక్కువగా గల పుస్తకా లామె యెక్కువగా చదివినది.

ఆ పుస్తకం బాగుంది—లేదా నచ్చింది. నచ్చలేదు—అనితప్ప ఆమె మరింకే విమర్శననూ ఇవ్వలేకపోయేది. కాని ఈమె చదువంతా వ్యర్థం కా వీలులేదుకదా. వివిధ మనస్తత్త్వాలను శాస్త్ర ఔదార్యంతో గమనించగలశక్తి, లోకం ఇంటిలోనున్నంత హాయిగా లేదన్న పరిజ్ఞానం, సుఖమంటే ఏమిటో పేరుకూడ వినని కోట్లకొలది ప్రజలు ప్రపంచంలో ఉన్నారన్నంతవరకు విజ్ఞానం ఆమె కున్నది.

వానితోబాటు, కొందరు ప్రముఖ రచయితల పుస్తకాల నీ చర్చల పునాదిపై చదివింపజేశాను. చదివినతర్వాత వానిపై ఆమెను క్రుచ్చిక్రుచ్చి ప్రశ్నలువేసి చాల అయువు పట్టులపై ఆలోచించేటట్టుగాకూడ చేశాను.

తుర్గెనేవ్ వ్రాసిన 'బీటభూమి' (వర్జిన్ సాయిల్) నొక సారి చదవమని ఇచ్చాను. జారిస్టు రష్యాలోని సంఘంలోని కుళ్ళును తొలగించేందుకై పూనుకున్న ఉన్నతవర్గానికి చెందిన ఒక యువకుని, యువతిని—వారి కార్య, కష్టపరంపరలను చదివింది.

ఆమె కళ్ళలో ఏదో క్రొత్త వెలుగు కనిపించింది. ఇదెంతో జీవితానికి దగ్గరగానున్నదని, ఇందులోని పాత్ర లెక్కడివారో కాక, అంచుపొంచులలో తిరుగుతున్నవారా అనిపిస్తుందని ఏదో లోకానికి చేయజాలని బతుకు బరువుదండుగనీ లక్షమాటలన్నది. ఎన్నడూ రెండుమాటల కెక్కువ ఏ పుస్తకంమీదకూడ చెప్పని యీమెతో ఇలా అనిపించిన దా నవల. కాని ఈ ఉత్సాహ మామెలో ఎలా క్రియారూపం తాలుస్తుందా అని ఆలోచించాను. కాని నాకేమీ అంతు పట్టలేదు.

తన మనస్సుకు చెందిన ఏవో వికారాలైతే సమస్యను తెలుసుకుంటే చాలునంటారు. ఆ సమస్యాపరిజ్ఞానమే పరిష్కారక మవుతుందంటారు. కాని ప్రపంచసమస్య లలాంటివికావు. అవి తెలుసుకున్నంతమాత్రంతో విడిపోవు. వాటినిగురించి వ్రాసినా, చదివినా, ఉపన్యసించినా పరిష్కారంకావు. వాటిని

విషదీసేందుకు పోరాడాలి. ఎంతో తెగించి ముందుకు నడవాలి. ఎంతో త్యాగం చెయ్యాలి. ఎన్ని సుఖాలో వదులుకోవాలి.

ఇన్ని చర్చలలోకూడ మామధ్య, ఒక్క వ్యక్తిగత విషయానికికూడ స్థానం చిక్కలేదు. ఆ సంగతు లసలు జ్ఞాపకానికి వచ్చేవేకావు. నిజానికి ఆమె సగంపేరూ, కుటుంబం పేరూ తప్పితే ఇంతదాకా నా కింకే వివరమూ తెలియదంటే నవ్వకండి.

నాదో విచిత్రప్రకృతి. ఎక్కడికక్కడే నా జిజ్ఞాస, ఎక్కడికక్కడే నా సద్భావమూ, స్నేహమూ, ద్వేషమూ, అసహ్యమూకూడ. ఒకమనిషి నెందుకుగా మనం తెలుసుకున్నామో అంతే. వారి పుట్టుపూర్వోత్తరాలు మనకెందుకనిపిస్తుంది. అలాగే ఒక మనిషి ఒకపని చేసినప్పుడు సద్భావమో, దుర్భావమో కలుగవచ్చు. అంతే—అంతమాత్రంతో ఆ ప్రాణినే పరమపాతకునిగా నేను పరిగణించను. అందుకు ఋజువులకోసం ప్రాకులాడను. స్నేహమున్నంతమాత్రంతో వారు చేసేవన్నీ మంచిపనులనీ తలంపను.

నేటి విషమసమాజంలోని, అర్థంలేని పరిస్థితులలో ఏ మనిషికూడ అచ్చుగుద్దినట్లు ఒకానొక రూపంతో మనకు కనిపించడు. మానవప్రకృతి అతి విచిత్రమైనది. లక్షరూపాయలతో, లక్ష సంఘటనలలో, లక్షపరిస్థితులలో ద్యోతకమవుతూంటుంది. అనవసరంగా ప్రతి మనిషినీ సమగ్రంగా తెలుసుకొనేందుకై ప్రాకులాడి, ఏదో కొంత అర్థార్థ పరిచయంతో కొన్ని నిర్ణయాలకురావడం, అవి ఆఖరున కేవలం కొన్ని

ప్రెజుడిసెస్‌గామాత్రమే మిగలడంవల్ల చాల బాధ లున్నవి. అవి ఇతరులకు కాక మనకే నష్టం కలిగిస్తాయి.

నే నొకరిని వెధవ అనుకున్నా, వంచకుడనుకున్నా అతని కందువల్ల వచ్చేనష్టం చాల తక్కువ. కాని నే నా వెధవతనం గట్టిగా తెలుసుకునేందుకు, అతనేదైనా మంచిపని చేశాడంటే, అందులో ఏదో ఆంతర్యమున్నదని దాన్ని తెలుసుకునేందుకు తల పగులగొట్టుకోవడంలో నేను పడవలసిన బాధ నరకమంత భయంకరమైనది. కాబట్టే నే నెన్నడూ ఆ జోలికి పోను.

నా పరిచితులలో కేవలం రాజకీయ సేవకులుగా, సాహిత్యపిపాసువులుగా, రచయితలుగా, కళాకారులుగా మెత్తనివారుగా ఇలా ఏదో ఒకరూపంలో మాత్రమే తెలిసినవా రున్నారు. వారి నా యా రూపాలలోమాత్రమే చూస్తాను. అంతకు లోతు కెన్నడూ పోను.

ఇక నైతికంగా ఏ స్నేహితునిగాని, పరిచితునిగాని నేను విలువగట్టి అధికప్రసంగానికి వెళ్ళనేవెళ్ళను. అందుకు నాకు హక్కుగాని, అధికారంగాని, సమర్థతగాని లేదని నేను బాగా యెఱుగుదును.

వీటన్నిటిమూలంగా ఆమె నొక జిజ్ఞాసగల మనిషిగా మాత్రమే నే నింతవరకూ చూస్తూవచ్చాను.

ఒక్కతూరిమట్టుకు ఇలాంటి చర్చల సందర్భంలోనే ఏదో వచ్చింది. మనదేశ స్వాతంత్రసంగ్రామచరిత్రలో జరిగిన

సంఘటననుగూర్చి తనకు తెలియదన్నది. ఏ స్వాతంత్ర్యోద్యమాల లోనో, ఏ సంవత్సరమో, ఏ రాజకీయ సంఘటనో జరిగిందని చెప్పగలవుగాని, ఈమాత్రం చరిత్రనే తెలుసుకోలేకపోతే ఎలా అని ఏదో చెప్పిపొడిచాను. ఆ సంఘటన దేశమంతా కదిపిందిగదా—మా కాలేజిలోని పిల్లలు కొందరైనా జండాలు పట్టుకొని బజార్లలో పడిఉంటారుకదా – నీవామాత్రమైనా చేయలేదా అన్నాను.

అప్పుడే విచారంతో అన్నది—"నేను దేశానికిగాని, ప్రజలకుగాని, ఉద్యమాలకుగాని చేసిన దేమిటి? జనాభా సంఖ్యకు కొంత చేర్చడంతప్ప నే చేసినపని మరొకటిలేదు." ఈమాటలవెనుక ఎంత పశ్చాత్తాపం రగులుకొంటున్నదో, ఆమె శాంత సుఖమయజీవితంలో ఎలా ఒక నిష్పూరవ్వ పడి నదో స్పష్టంగా నేను చూడగలిగాను.

నన్నుగురించి ఆమెకు తెలిసిన దంతకంటె చాల తక్కువనుకుంటాను. ఏదో కొంపలంటుకొనిపోతున్నాయనీ గుండెలు కుళ్లిపోయేట్టు బాధపడుతున్న అమాయకుడనో, కావలిస్తే అందుకై ఏదో చేస్తున్న విచిత్రవ్యక్తిననో తప్ప ఆమె కొక్క అక్షరం నా చరిత్ర తెలియదు. అప్పటప్పటి చర్చలలో సంభాషణలలోని ప్రస్తావనలమూలంగా దేశస్వాతం త్ర్యపోరాటంలో నేనుసైతం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను, అని తెలిసివుంటే వుండవచ్చును. అంతకంటె ఎక్కువగా తెలుసుకునేందుకుకూడ ఆమె ప్రయత్నించినట్టు కనిపించదు.

ఇలాంటి సాత్త్విక పరిజ్ఞానంతోనే మాలో ఏదో ఒక సన్నిహితత్వం ఏర్పడింది. ఆమె మనం స్నేహితులమనేది గాని, నే ననుకోలేదు. ఇదొకసన్నిహిత పరిచయంగామాత్రమే తలంచేవాడిని. మాటలాడినవారల్లా స్నేహితులనుకోవడం ఆమాట విలువను పోగొట్టడమేనని నా దృష్టి.

# 5

ఓ భావకవి మంచిపద్యం వింటున్నప్పుడు, ఓ ప్రాతచిత్తరువును చూస్తున్నప్పుడు, ఓ త్యాగరాయకృతి వింటున్నప్పుడు ఏదో హాయిగా ఉంటుంది. కాని అందులో ఏవిధమైన అశాంతిగాని, ఆందోళనగాని, ఆవేదనగాని ప్రకోపింపవు. అలాంటి నెమ్మదినిమాత్రమే ఆమెతో మాటలాడుతున్నప్పుడు అనుభవిస్తూ వచ్చాను.

ఏ మమకారమూ, స్వత్వాపేక్షా లేని కొత్తరకపు సహవాసం ఎలాంటి భావం కలిగిస్తుందో అంతమాత్రమే నాలోనూ కలిగింది. అంతకుమించి కాదు.

ఆమె ఎవరో నాకు తెలీదు. ఆమెకు మగడో ప్రియుడో వున్నాడో లేడో నాకు తెలీదు. పిల్లా జెల్లా సంసారం ఉన్నదో లేదో అసలు తెలియదు. ఆమెను కేవలం ఆమెగామాత్రమే చూచాను. ఆ చర్చనీయాంశాలలోని గభీరతను లోతుపాతులను చూడ్డంలోనే ఆమెకు నా అంతరాంతరాలలోని అశాంతిని, ఆవేదనను చూపడంలోనే, ఆమె జిజ్ఞాసను తేపడంలోనే తహతహ చూపాను.

ఆ అరగంటో, గంటో చర్చ ముగియగనే, ఆమె వెడుతున్నదా లేదా అని చూచుకునేవాడిని కాదు. ఆమె యెక్కడికి, యెలా వెడుతున్నదో నాకు తెలీదు. మిగత కాల మంతా ఎవరితో ఎలా గడుపుతుందో నే నెఱుగను. ఆమె ప్రవర్తన ఎలాంటిదో, ఎలాంటి మిత్రులా మెకున్నారో, ఎలాంటిచోట్ల ఆమె ఉంటూఉంటుందో అనే జిజ్ఞాస నాకు లేదు.

ఒకప్పు డామె నడిచివెళ్ళేది. ఒకప్పుడు బస్సులో పోయేది. ఒకప్పుడు కారులో బయలుదేరేది. ఒకప్పు డో మిత్రునితో పోయేది. మరొకప్పు డామె సహోద్యోగులో, సహానువర్తులో వెంట నడిచేవారు. ఒకాయనమాత్రం పదే పదే ఆమెతో కనిపిస్తూండేవాడు. అతి సన్నిహితంగా వారు మెలగేవా రనుకుంటాను.

మరి ఆమె ఏ ప్రశ్నతోనో తయారయ్యేవరకు, ఆమె అస్తిత్వాన్నే మఱచిపోయేవాడిని. అట్లని ఆమెయెడ ఉపేక్ష భావమూలేదు! ఆమె కనిపిస్తే సంతోషించేవాడినే కాని, ఆమె కనిపించకపోతే కించపడేవాడిని కాదు.

కాని అన్యోన్యం మేము క్రమంగా స్నేహితులవుతూ వస్తున్నాము. నే నేదో పనిమీద ఉన్నట్టయితే ఆమె 'ఏమి టండీ' అని పలకరించేది. ఒక్కసారి పరధ్యానంలోనుండి తెప్పరిల్లుకొని 'ఏమి' టనగా 'ఆ ఊరికనే, మీ పని చెడగొడ దామని' అనేది. నేనూ ఆమె ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నప్పు డలాగే కదిపేవాడిని.

నే నేవో విషణ్ణంగా కనిపిస్తే ఆమె నవ్వించేందు కెంతో ప్రయత్నించేది. కారణ మేమిటో కనుక్కోవాలని తాపత్రయపడేది. ఆమెమాత్రం ఎల్లప్పుడూ నవ్వుతూ తుళ్లుతూనే ఉండేది.

అప్పుడప్పుడు తన సొంతవిషయాలు చెప్పాలనుకునేది. పాపం ఏం చెబుతుంది – మా చెల్లెళ్లు గురువారం వచ్చేరు – శనివారం వెడతారు–మేము నిన్నటిరాత్రి వుడ్ లాండ్సులో పార్టీ చేసుకున్నాం–దీపా లారిపోయాయి – కొవ్వొత్తులు వెలిగించుకోవలసివచ్చింది. అందొకసారి "There is something romantic about it." అన్నాను వ్యంగ్యంగా – ఇక అలాంటిమాటలు చెప్పడం మానివేసింది.

ఏదో ఒకవిషయంపై తప్ప ఇలాంటి సంభాషణకు మామధ్య ఎన్నడూ అవకాశం కనిపించేది కాదు. కాని సాంఘికసమస్యలపైగాని, తాత్త్వికసమస్యలపైగాని మాట్లాడు తున్నప్పటికి జీవితంలోనుంచి చాలా ఉదాహరణ లిచ్చేవాడిని. అలాంటప్పుడు కొన్ని తెలిసిన సంగతులు చెప్పవలసివచ్చేది. ఇవన్నీ మీ కెలా తెలుసునని ఒకసారి చాల అమాయికంగా అడిగింది. పుస్తకాలతో కాక జీవితంతోకూడా నాకు పరిచయ మున్నదని చెప్పాను.

అడపాదడపా కళలూ, కవిత్వం అనేవానిమీదకూడ జీవితప్రాబల్యం ఎలా పనిచేస్తుందో మాట్లాడుకునేవారం. కవిత్వం హృదయంలో అశాంతి రేపుతుందంటే ఆమె నమ్మేది కాదు. అసలు లలితకళలంటే అవేవో నిద్రపుచ్చేందుకు,

లేదా కష్టపరిసరాలనుంచి మనసును తప్పించేందుకుమాత్రమే వుద్దేశింపబడినవన్న అభిప్రాయం ఆమెకు చాల గాఢంగా ఉండేది. అసలందుకు పూర్తిగా వ్యతిరేకమైన అభిప్రాయాన్ని నేను వెల్లడించేప్పటికి 'చిత్రమైన మనిషే, ప్రతిదీ తలకిందు లుగా చెబుతారేమి' టన్నట్టు చూచేది.

సౌందర్యోజ్వలప్రకృతికూడ జోలపాడదనీ, నీ మెదడులో ఏదో అశాంతిని, కలతను రేపుతుందనీ చెప్పాను. పద్యం చదివినా, పాటవిన్నా, బొమ్మచూచినా నీ కిక ఆరోజు నిద్రపట్టరాదు. నెమ్మది ఉండరాదు. ఏదో నీ హృదయం అగాధాలలోనుంచి ఒక విస్మృతినది కలచి రేపెట్టాలి. అదే దానిలోని నైశిత్యానికి, సమగ్రతకు గీటురాయి.

నా పద్య మెవరైనా చదివితే దీనితో లోకం పాడై పోతుందనాలి! నా రచనలవల్ల యువకు లావేశపరులై పాడవుతారని, అరాచకచర్యలకు పాల్పడతారనీ అనాలి. లేదా ఈ పద్యంమూలంగా మనసులు మారి యువకు లేదో భావి స్వర్ణయుగానికి వైతాళికు . లవుతారనైనా అనాలి. ఈ రెంటిలో ఏది జరుగుతుందన్నా నా కవిత్వం చరితార్థ మయినదనుకుంటాను. కాని చదివి ఆ కాసేపూ తలవూపి తర్వాత దాని నలా మరచిపోయే ఔదాసీన్యం నేను సహించ లేను. అప్పుడు నా రచన వ్యర్థమనుకుంటాను. సిగ్గుపడతాను. పుస్తకం చదివి అబ్బ – దారుణం అని విసిరికొట్టాలి. లేదా We must do something అని వెంటనే పుస్తకాన్ని అతి సుకుమారంగా జేబులో ఉంచుకొని ఆలోచిస్తూ ఆరుబయట

కైనా వెళ్ళాలి. ఈ రెంటిలో ఏదీ చేయకుండా పుస్తకం చదివి ఆవులించి బల్లపై మట్టసంగా పెట్టి పాఠకుడు నిద్రపో యాడంటే అంతకంటె దరిద్రపుగొట్టు రచన ఇక పుట్టబోదని అర్థం.

ఈ ధోరణి విని 'నే నెంత మంచి పద్యాలనో ఇతరులు చెప్పేవి చదివాను. పద్యం పూర్తి గాకముందే నిద్రపో యేదా' న్నని చెప్పింది. కొన్ని షెల్లీ పద్యాలు గుర్తుంచి, చదివి తర్వాత చెప్పమన్నాను. మయకోవస్కీ-వరకు పోకుం డానే ఏ నిజమైన కవిఅయినా నీ మనసులో తుపాను రేపి తీరుతా డన్నాను. కాని అందుకు కొంత సంస్కారమో, ఆ సమస్యలపైనున్న తీవ్ర అభినివేశమో తప్పనిసరి అని చెప్పాను.

'I fall on the thorns of life and bleed.'

కవిహృదయవీణ కున్న తంత్రులు చాల సున్నిత మైనవి. కాబట్టి అతిస్వల్పంగా మొండిమనసులకు కనిపించేవి, అసలు కనిపించనివికూడ అతను చూస్తాడు. వానితో సంచ లితమైన అతనిగుండె తంబురఝుంకారంతో మరింత స్పష్టంగా వానిని విడదీసి మనకు భూతద్దంవేసి చూపిస్తుంది. మన మంత వరకూ చూస్తూనే, గుర్తించలేనివాని విశ్వరూపాన్ని చూచి నప్పుడు మన మొండి హృదయతంత్రులుకూడ శృతి కలుపు తాయి. 'నేను సైతం విశ్వవీణకు వెట్టిగొంతుక లిచ్చి మ్రోశాను' అని గర్వించే కవితోపాటు, 'నేనుకూడా కవివిపం చికి మొండిమనసును కలిపి ఏడ్చాను' అని పాఠకు డంటాడు

శాంతి కళలకు పరమావధికాదు. అలాగే వట్టి ఆవేశం ఉద్రిక్తతకూడ కాదు. రెంటినీ కలిపి కుచ్చిన క్రియారూప ప్రేరక నిశ్చితజ్ఞత కళల కాశయ మంటాను నేను. విప్లవకారుని మనసుకూడ శాంతియుతమే. శుష్కోద్రేకి విప్లవకారి కాలేడు. అలాగే చచ్చుసన్యాసి ప్రపంచసమస్యలకు జడిసి శాంతి శాంతి అని వేకారుతూ తాను శాంతుడనని అరణ్యాలలో దాగి అనుకోవచ్చును. శాంతి రెండు విధాలు. అశాంతిని పోగొట్టాలనే స్థితప్రజ్ఞతలోని శాంతి నిజమైనది. అశాంతి నుండి ముఖం తప్పించుకొని కృత్రిమంగా లోని కుళ్లును కప్పుకునేందుకై నల్లమందుమత్తులో నున్న శాంతి అసత్యం.

పిరికిపంద శాంతివాది కాడు. అశాంతికోసమే శాంతిని చెడగొట్టేవాడు విప్లవకారీ కాడు. లోని ఆంతర్యాన్ని కప్పిపుచ్చి మసిపూసి మారేడుగాయను చేసే పదజాలం చాల ఉన్నది. శాంతి, సత్యం, అరాచకం, అవినీతి ఈ మాటలను లక్షసార్లు ప్రతివాడూ ఉపయోగిస్తాడు. అలాగే స్వాతంత్రం, సమానత, లోకకళ్యాణం ప్రతివారూ అంటూనేఉంటారు. కాని ఒక్కరూ ఆ పదాలలోని అంతుపొంతులను, తామే విధంగా నిర్వచించుకుంటున్నామన్న పరిశీలనలోనికి వెళ్లరు. కాబట్టే ఎవరెంత మంచి పదం వాడుతున్నా రన్నదిగాక, ఎవరెలాంటి పనిని ఎందుకై చేస్తున్నా రన్న దానిపైనే మనం ఎక్కువ దృష్టి నుంచి చూస్తుండాలి.

సంప్రదాయానుగతంగా, పదేపదే విని విని కొన్ని పదాలు మనకు బాగా తెలిసిపోయినట్లుగా వినిపిస్తుంటాయి.

ఆ పదాల కర్థ మెవరైనా అడిగితే ఇంత బడుద్ధాయివేమిరా అని వెంటనే వెక్కిరిద్దా మనిపిస్తుంది. కాని కాస్త తమాయించుకొని ఆలోచిస్తే నిజంగా మనకు వాని అర్థం సరిగా తెలీదు. తెలిసినా ఒకొకరం, ఒకొక అర్థంలో వానిని ఉపయోగిస్తూనైనాఉంటాము. దేనినైనా నిర్వచనం కొద్దీ చూడాలి. నేనూ స్వతంత్రం కావాలంటాను. మరొకరూ అంటారు—కాని మే మిద్దరమూ రోజూ దెబ్బలాడవలసివస్తున్న దంటే అర్థ మేమిటి? నా స్వతంత్రం అతనికి అస్వతంత్రత—అతని స్వతంత్రం నా స్వతంత్రానికి ఉరిత్రాడు అని అర్థం. మే మిలా ఒకే పదానికి వేరువేరుగా నిర్వచనా లిచ్చుకొనేందుకు మా వైయక్తిక ప్రకృతిలో కాక సంఘంలో మాయిద్దరి స్థానాలలో ఎక్కువగా మూలకారణాలు కనిపిస్తాయి. శాస్త్రీయవిజ్ఞాన మింత పెరుగుతున్నది. మన పరిసరాలను గూర్చి, మన మనఃప్రపంచాన్నిగూర్చి ఎన్నో అపూర్వ సత్యాలు రోజూ వెల్లడవుతున్నవి. కాని ఈ సత్యాలను మన దృక్పథంలో ఎంతవరకు కలిపివేసుకోగలుగుతున్నాము. అసలు వైజ్ఞానికుల్లోకూడ తాము తారకలనుగూర్చో, చందమామనుగూర్చో, సూర్యమండలంగూర్చో కనుక్కున్న సత్యాలద్వారా తమ తాత్త్వికదృష్టి మారినదా? తమ మత విశ్వాసాలు మారినవా? లోకంలో మానవు డడుగుపెట్టి ప్రకృతితో పోరాడ్డం ఆరంభించినప్పుడు తా నేర్పర్చుకున్న భావాలే, ఇన్ని సత్యాలపరిశీలనతర్వాతకూడ అతను గుడ్డిగా ఎందు కనుకరించాలి? గ్రహణమేమిటో దుర్భిణీయంత్రాలతో

విద్యార్థులకు వివరించి, గ్రహణమోక్షణవేళలో గంగలో మునిగి పితరులకు తర్పణాదులు విడిచి సూర్యుని పట్టుకున్న రాహువుపీడ తొలగినదని సంతసంతో ప్రాచీన మానవుడు నిట్టూర్చిన మంత్రాల నెందుకు వల్లిస్తాడు?

మన శాస్త్రీయవిజ్ఞానం మన తాత్త్వికాలోచనలను, జీవనదృక్పథాలను మార్చక, అదొక శాఖగా ఇదొక నమ్మకంగా ఉన్నంతదాకా మనిషిఆలోచన సక్రమం కాలేదు. అలాంటి శాస్త్రీయ దృక్పథం కావాలి—

ఇలా లక్షల సంగతులు చెబుతూపోయేవాడిని.ఎలాంటి పారిభాషిక పదాడంబరం లేకుండా, లోకం పాడవుతోంది, బాగుపరచ రేమర్రా అని మొరపెట్టుకుంటున్న ముగ్ధహృదయ విలాపంగా కవిత్వంలా సాగివస్తున్న నా మాటలను చూచి నేనే ఒకోమారు దిగ్భ్రాంతుడ నయ్యేవాడను.

మనుష్యుల్లో కొందరు నాలుకతోను, కొందరు కలంతోను, కొందరు చేతులతోను, కొందరు తలతోను, మరి కొందరు గుండెతోను ఆలోచిస్తారు, కావచ్చును. నేను నాలుకతో ఆలోచించేవర్గంలోనివాడ ననుకుంటాను.

ఆమె ఎంత ఆసక్తితో వినే దని! ఎంత తీవ్రంగా ఆలోచించే దని! ఇతరులతో ఎంత గట్టిగ్గా వాదించేదని! ఆమె మిత్రులలో చాలామంది కీ భావాలు నాణ్యం తెలియని సరుకు. వారేవో గొర్రెదాటు మాటలతో ఈమె నెదుర్కొనేవారు. కాని ఏమైనా చెప్పనీ-'నా కెందుకో మీ మాటల్లో సత్యం-ఒక విశ్వాసం-ఒక ఆవేదన కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. వా

రెంతవరకూ ఇదేదో చెలగాటంగా భావిస్తారు గాని అభిప్రాయాల దెబ్బలాటతో జీవితసంగ్రామం సాగుతున్నదని గమనించనే గమనించరు' అని ఆమె ఒకప్పుడు నాతో అన్నది. కడకు వారితో నాయంత చక్కగా చెప్పలేకపోతున్నానని తన అశక్తతకు నొచ్చుకొనేది. కడకోసారి తన ప్రియమిత్రునితో వాదించి, అతని అజ్ఞానానికి రెచ్చిపోయి, మొండి వాదానికి జవాబివ్వలేక కోపోద్రేకంతో 'గెటవుట్' అన్నది. ఆ సంగతి నాతో చెప్పి, 'మీరయితే అలా అనివుండేవారు కాదు. కాని నా కంతకంటె మరేమీ తోచలేదు' అన్నది.

అందుకని తన మిత్రులను కొందరిని పరిచయం చేసిందికూడ. నవ్వుతూనే వారి కేదో ఘాటుగా చెప్పేవాడిని. వారిని వెర్రి వెంగళప్పలుగా చూసేవాడిని. కారణం వారు తక్కువవారని గాదు. జీవితం విలాసవస్తువుగా భావించి బ్రతుకును పాచికగా ఆడుకునేవారి భావాలేవైనా ఒకటేనన్న వుపేక్ష నాది.

ఈ వర్గంలోని మహామహులు నిన్నటిదాక దేశభక్తిని వేళాకోళం చేశారు. తెల్లదొరలకు సలాముకొట్టి ఊరేగారు. వారి కరస్పర్శ తమకే కాక తమ కుటుంబాలనీ పవిత్రంచేస్తుందని భావించారు. ఒక్క-రాత్రిలో కాంగ్రెసురాజ్యం రాగానే అయిదవజార్జి పటాల ఫ్రేములలోనే గాంధీ నెహ్రూల బొమ్మలను దోపి కొత్త మలుకులు కొట్టించారు. అదేనోటితో దేశంకోసం పోరాడిన మహావీరులకు జేజేలు పెడుతున్నారు. కాబట్టి వీరివి అభిప్రాయాలు కావు. వీరు మనుషులు కారు.

వట్టి నీడలు. నీడలతో పోట్లాడడం మూర్ఖమో అజ్ఞానమో అవుతుంది.

ఈ మా సఖ్యం క్రమంగా వ్యక్తిగత స్నేహరూపం తాల్చసాగినది. ఆమె వెడుతున్నప్పుడు కూడా కాస్త దూర మైనా వెడదామనిపించేది. కాసేపు దారిలోనే నిలబెట్టి సంభాషణ సాగదీస్తూ ఆలస్యం చేద్దామనిపించేది. ఆమె రాగానే ఎంత త్వరగా వీలయితే అంత త్వరగా మాట్లాడాలని తోచేది. విడిపోతే అదేదో దిగులుగా ఉండేది.

కాని ఈ మైత్రిలో ఏవిధమైన రాగం గాని, ఆవేశం గాని లేదు. ఆనందమొక్కటే తలమున్కలుగా కనిపించేది. ఒక్క మాతిబిగింపుకాని, ఒక్క కటుభాషణంకాని, ఒక్క చిరుకోపంకాని-నహి-అలాంటి చిలిపితనాని కిందులో చోటు లేదు.

ఏమాత్రం మేము స్త్రీ పురుష విభిన్నజాతులకు చెం దినవారమన్న జ్ఞానమే లేకుండా — అతి చనువుగా, అతిగంభీ రంగా, అత్యున్నతస్థాయిలో మెలగుతూ వచ్చాము.

ఈ ఆనందంలో నేనో మహత్తును చూచాను. ఆకా శపు టంచులలో చిత్తరువులు గీసుకొన్నాను.

కాని అంత ఆనందాన్ని చేతులార వ్రక్కలుకొట్టుకున్న నా అజ్ఞానానికి తల పగులగొట్టుకోవడం కన్న శిక్ష మరొకటి తోచడంలేదు.

# 6

ఆ రోజొక విందు. చాలమంది మిత్రులు చేరారు. నేనూ వెళ్ళాను. ఆమె యెంతో ఉత్సాహంతో పాల్గొంటున్నది. అందరం భోజనాలకు కూర్చోబోతున్నాము. నా ప్రక్కనే ఉన్న కుర్చీ ఖాళీగా ఉన్నది. ఆమె యెటు కూర్చోవాలా అని చూస్తున్నది. ఆ ఖాళీస్థలం చూపి ఆమెను కూచోమన్నాను. మే మిద్దరమూ చాల స్నేహంగా ఉంటామని అక్కడున్న వారందరూ ఎఱుగుదురు. నే నిలా పిలవడంలో కాని, ఆమె కూర్చోవడంలో కాని ఏ ప్రత్యేకతా వారు చూపరు. కాని ఆమె కూర్చోలేదు. కూర్చోననీ చెప్పలేదు. అటూ ఇటూ చూచి లోనికెళ్ళింది. కాసేపటికి పళ్ళెరంతో బయటకు వచ్చి నేనున్న వేపుకు చాల దూరంలో ఉన్న మరోబంతిలో వడ్డించ నారంభించింది. నాలుక కొఱుక్కొని నంజుతున్నాను.

ఏవేవో కబుర్లు చెప్పుకుంటున్నా రందరూ. ఏవో వక్రోక్తులతో చేరినవారందరి దృష్టినీ ఆకర్షించడం, గట్టిగా నవ్వడం నా కలవాటు. అప్పు డివేవీ నా కందుబాటులో ఉన్నట్టు కన్పించ లేదు. పరధ్యానంగా ఎవరో అన్నమాట కేదో నవ్వినట్టు నటించడంతప్ప నా కేమీ చేతకాలేదు.

ఆమె సహజంగా పిలవగానే వచ్చి కూచొనిఉండినా, నే నాట్టే మహదానంద మేమీ పొందిఉండేవాడిని కాదని

గట్టిగా చెప్పగలను. కాని రాకపోయినంతమాత్రంలో నే నింత ఆందోళన చెందుతున్నందుకు నాలో నేనే సిగ్గుపడ్డాను.

ఆరోజు ఆమె నిజంగా చాల అందంగా కనిపించింది. మొట్టమొదటిసారిగా ఆమె స్త్రీత్వాన్ని ఆరోజు గుర్తించాను. ఇంతవరకూ ఆమె అందమైనదో వికారమైనదో నా మనసుకే తట్టలేదు. ఆమె అంత సన్నిహితంగా కూర్చొని మాటాడుతున్నప్పు డేమాత్రం ఆలోచని ఆలోచనలు తలలో తిరిగినవి. ఆ కళ్ళలో ఏదో వెలుగు గీత లున్నవి. ఎంత చలాకీగా పిల్లలా నడుస్తున్నది!

మరీ అందంగా కనిపించేందుకై ఏమంత సంబరపడి సొగసు చేసుకున్న వన్నెచిన్నెలు లేవు. ఆమె ముఖంవేపు గంటలకొలది చూస్తున్నప్పుడు కనిపించని గొంతులోని గొలుసు నా మనస్సును లాగివేస్తున్నట్టు కనిపించింది. ఆ గొలుసులో ఏదో ప్రత్యేకత ఉన్నది. దాని రూపురేఖల నీమెకోసమే ప్రత్యేకించి సృష్టిచేసినట్లున్నది. అంతతప్ప మరో ఆభరణా లేవీ ఆమె పెట్టుకోదు. కాని ఆ గొంతుక, ఆ కళ్లూ, ఆ ముఖం నిజంగా చాల ఆకర్షకతగల మనిషి అనిపించింది. మెల్లగా ఆమె తిరుగుతున్న వేపు చూపులు సారించాను. ఆమె కనిపించ లేదు.

ఆమె కనిపించపోయినంతమాత్రాన గాని, ఆమె నా ప్రక్కన వచ్చి కూచోనంతమాత్రానగాని నే నెందు కిలా కించపడిపోవాలి? అస లిలాంటి అంశాలను గుర్తించే అలవాటే లేని నాలో ఈ మార్పేమిటి? గాభరాపడిపొయ్యాను. Every

woman is a trap—beware of her అన్న షా మాట జ్ఞాపకంవచ్చి పెదవి కొరుక్కున్నాను.

స్త్రీ త్యాకర్షణకు అందని మగవాడనని గర్వపడేవారు మా మిత్రులు. వారితో అతి సహజంగా చనువుగా ప్రవర్తిస్తూ వారి ఆంతరంగిక విషయాలనుకూడ వింటూ, వారిలో ఏవిధ మైన సంచలనం కలుగుతున్నదని తెలిసినా ఒక్క ఘాటైన మాటతో, ఒక్క వక్రోక్తితో వారి నోరు నొక్కివేసే అల వాటున్న పాతమనిషినేనా అని నాకే సందేహం వచ్చింది. నిశితంగా వారి కళ్లలోకి చూస్తూ నిర్మలమైన వాక్యరితో వారిలో అలాంటి తలపులకే అవకాశం లేకుండా చేసేవాడిని.

ముఖ్యంగా నేనంటే కాస్త గొప్పగా చూచేవారి సంగ తలాఉంచి, సమానవయస్కులోని స్త్రీలతోకూడ అతి ఘాటుగా మాట్లాడడంద్వారా, వారిలోని ఆర్ద్రప్రకృతిని ఆదుకొనేవాడిని కాదని చూడ్డంతోనే వారికి తెలిసిపోయేది. వారెవ్వరూ నాజోలికి వచ్చేవారు కారు.

అందులోను వట్టివేషాలు నాకసలు గిట్టవని తెలిసిన వారే చాలమంది. పైగా నాకేదో తాత్త్వికసారస్వత విష యాలుతప్ప మిగతవి పట్టవు గనుక వీరితో సంభాషణకే అవ కాశం ఆట్టే కనిపించేది కాదు. మరిప్పు డేమిటి?

"లేవ రేం" అంటూ చేతులు కడుక్కుంటూ వస్తూన్న ఒక మిత్రు డన్నాడు. 'భుక్తాయాసం' అని సాగదీస్తూ లేచి వెడుతున్నాను. ఆమె దారిలో నిల్చున్నది. ఆమె ముఖం లోకి చూచాను.

"నన్నర్థంచేసుకోరూ? క్షమించరూ?" అన్నట్లుగా ఆమె ముఖంపెట్టి నా కళ్ళలోకి చూచింది. ఆ ముఖభంగిమ నేటికీ నా యెట్టయెదుట కనిపిస్తున్నది. కాని యెలాఉన్నదో మాటలలో చెప్పి మీకా ప్రతిమ కనబడేట్టు చేసేంత గొప్ప కవిని కాదు నేను. ఎంత చనువు, ఎంత ప్రాధేయత, ఎంత అశక్తత, ఎంత విశ్వాసం, ఎంత కవిత్వం ఆ కళ్ళలో మెరుస్తున్నవని! అంత తక్కువసేపులో అంత సూటిగా గుండెలో లక్షవిషయాలను కూరగల శక్తి ఏ కావ్యానికికూడ లేదనుకుంటాను. ఆ రెండు కళ్ళూ రెండు కావ్యాలు. ఆనాటినుంచీ ఈనాటిదాకా వానిని చదువుతూనే ఉన్నాను. కాని వానిలో అంతర్గర్భితమైఉన్న స్వారస్యాన్నిప్పటికీ అంతో ఇంతో తప్ప, పూర్తిగా ఆస్వాదించలేకపోతున్నాను.

కళ్ళలో మాట్లాడ్డం ఎలాంటిదో ఆ రోజే చూచాను. మొట్టమొదటిసారిగా ఒక వ్యక్తి మానవభాషలో మాట్లాడించి అర్థంచేసుకొనేలా చేయగలిగింది నన్ను. ఈ చూపులకున్న భావవ్యక్తీకరణపాటవం మాటల కెలా అబ్బుతుంది?

మన తలలో ఒక తీవ్రమైన భావాన్ని రేపడం ఒక్క కావ్యానికీ, సంగీతానికీ మాత్రమే ఉన్నదని ఇందాకా భావించేవాడను. కవిత్వంలో ఉన్న మరుగుకూడ సంగీతంలో ఉండదు. మరి ఈ చూపులకూ నా మనస్సుకూ మధ్య ఉన్న తెర మరింత పలుచనిది. అసలున్నదా అనికూడ అనుమానం.

ఆ కళ్ళేమేమి చెప్పాయోకూడ సమగ్రంగా నేను చెప్పలేను. కాని నాకు తెలుసును. అవప్పుడెలా ఉన్నాయో

చెప్పలేను. కాని నే నూహించగలను. నా భాష చాలదు. నన్ను వదిలి మీరే భావించుకోండి.

ఆ క్షణంలో నన్ను నేను మరచిపోయాను. నా కించ గాలికి పోయింది. ఆకసంలో పూలతెప్పలో అలకాపురి పోతు న్నాను.

మొట్టమొదటిసారిగా ఆమెను ప్రేమించాను. ఆమెను ప్రేమించానని తెలుసుకున్నాననడం మరింత సత్యమేమో!

# 7

ఆ ప్రేమ నన్ను వేధించలేదు. సాధించలేదు, నన్నెంతో ఆనందింపజేసింది. అదో అమాయిక సంతృప్తి ద్యోతకమైనది. ఎండిపోయిన గుండె చిగురించింది, ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు?

సరిగ్గా పదేళ్ళక్రితం నా గుండె ఎండిపోయింది. నవ నవోన్మేష మవుతున్న పూలమొక్క తుపానుకు కూలిపోయింది. అంతే. తిరిగి దానిని నాటేందుకుకానీ, నీరు పోసేందుకుకాని నేను ప్రయత్నించలేదు. జీవిత సహచారిణిగా ఉంటుం దను కొన్న ఒక అమ్మాయి 'నీ తలతిక్క రాజకీయాలు వదిలితే తప్ప మనం కలిసి బతకడం అసాధ్య' మని లక్ష డొక్కతిరు గుడులతో చెప్పివేసింది. ఆ నా డనుకున్నాను — ఒక్కరిని ప్రేమించడంలోనే ఆనంద ముంటే అశేష బాధిత ప్రజను ప్రేమించి వారికోసం బాధపడ్డంలో మరింత ఆనంద ముంటుం దని! నా సౌఖ్యంకన్న మరేదో గొప్ప దొకటి నన్నాకర్షిస్తే

న్నది. దివిటీకోసం చందమామను వదులుకోలేను—వెంటనే ఆమెతో సెలవు తీసుకున్నాను.

ఆనాడే గ్రహించాను, స్త్రీ అపేక్షించేది చాలవరకు సుఖ మనీ, అందులోను మానసికంగా కాక, రెండుచేతులా పట్టుకొని చూడఏలయ్యే సౌఖ్య మామెకు కావాలనీ. అట్లని అందరినీ నే ననను. కాని చాలమంది ఇంతే నంటాను. ఇందుకు సంఘంలో వారి కొక్క స్వత్వమూ లేకపోవడం, బానిసతనం, తన్ను విలాసవస్తువుగా తయారుచేసిన వాతావరణం ఇవన్నీనూ — నైయ_క్తికంగా స్త్రీత్వంలోనే సుఖాపేక్ష ఉన్నదని కాదు. మనదేశంలో, మనకాలంలో, మన మేధావి — మధ్యతరగతివర్గంలో ఉన్న స్త్రీ అపేక్షించేది భీమాపట్టా—ఇదే నే నంటున్నది.

ఆ రోజునుండీ నేను సన్యాసినైపొయ్యానని చెప్పడం లేదు. కాని హృదయంలోని ఏ లోతుల్లోకో చొచ్చుకొనిపొయ్యే ఆ కాంక్ష, ఆ తీవ్రప్రేమను మరిక అనుభవించలేదు— అందుకై ప్రయత్నించలేదు. చాలమందిని ఆదరంతో చూచాను. వారి ఆదరాన్ని చూఱగొన్నాను. కాని అది హృదయానికి చెందినదీ కాదు—శరీరానికి చెందినదీకాదు—తలకు మాత్రమే అందునది—

ఒక్కసారిగా నాలో మార్పు వచ్చింది. తిమ్మిరెక్కిన గుండెనుకూడ గిలిగింతలు పెట్టగల ఏదో బలీయమైన శ_క్తికి లోనైపొయ్యాను. కాని యువకునికిలా అందులో తల తిరిగి

